# భారతీయ సంస్కృతి




రచయిత:

టి. కోదండరామారావు

# భారతీయ సంస్కృతి

విషయ సూచిక :

# విన్నపము



భారతీయ సంస్కృతిని గురించి ఎందరో మహనీయులు వారి రచనలు, ఉపన్యాసములలో ప్రస్తుతించినారు. వారిలో ప్రముఖులు రాజారామమోహనరాయ్, స్వామి దయానందసరస్వతి, స్వామి వివేకానంద, శ్రీ అరవిందులు, డాక్టర్ అనిబిసెంటు, సర్ జాన్ వుడ్రాఫ్, హావెల్, డా॥ ఆనందకుమారస్వామి, ఎ. కె. బెనర్జి గారలు. భారతీయ సంస్కృతి విశేషములను కూలంకషముగ వివరించి భారత ఔన్నత్యమును ప్రపంచమునకు చూపినవారిలో అగ్రగణ్యుడు శ్రీ అరవిందులు. సామాన్యజనుల కుపయోగార్థము పై నుదహరించిన మహనీయుల రచనలకు ప్రస్తావనగా నుండుటకీ చిన్న పుస్తకము వ్రాయబడినది. ఇది పాఠకుల కుపకరించినచో, నా శ్రమ వృథా కాలేదని తలంతును.

ఈ రచనను పరిశీలించి దీనిని ప్రచురించుటకు సాయపడిన కర్మయోగనిరతులు వివేక వినయశీల సంపన్నులు, తెనాలి శ్రీ అరవిందసొసైటి కార్యకర్తలైన శ్రీ జి. సత్యనారాయణగారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ రచన ముద్రణకు ద్రవ్య సహాయము చేసి, భారతీయ సంస్కృతిని సర్వవిధముల పోషించుచున్న తిరుపతి దేవస్థానము వారికి నా హృదయపూర్వక నమస్కారములు.

ఈ పుస్తకమును మేము కోరిన రీతిగా సకాలములో సుందరముగా ముద్రించిఇచ్చిన తెనాలి బాబా ఆర్ట్ ప్రింటర్స్ వారికి నా అభినందనలు.

ఇట్లు,

సుజన విధేయుడు

టి. కోదండరామరావు

# భారతీయ సంస్కృతి



## జీవితాదర్శము

మానవుని జీవితాదర్శము ఈ ప్రపంచములో సుఖముగా జీవించుటయే. అంతరాత్మ, మనఃశరీరములకు గల, సామంజస్య సామరస్యములను కనుగొని, వీటిని జీవితములో స్థాపించుటయే నిజమైన సౌఖ్యము. ఈ సామరస్యమును కనుగొను భావములను బట్టి, దీనిని స్థాపించు విధానములనుబట్టి ఒకానొక సంస్కృతి సరి అయినదా కాదా యని నిర్ణయింపవలసి యున్నది. అదే విధముగ ఒకదేశపు నాగరికత సమగ్ర సౌఖ్యమును చేకూర్చునా యను విషయము కూడ, ఆ దేశపు ఆశయములు, భావములు, విధానములు, సంస్థలనుబట్టి నిర్ణయింపవలసి యుండును. ఈ ఆశయములు ఇప్పటి ఐరోపాదేశ నాగరికతవలె ఎక్కువగా భౌతికముగను, లేక గ్రీకు రోమన్‌దేశ నాగరికతల వలె నెక్కువగా మానసికముగను, లేదా, భారతీయ సంస్కృతివలె నెక్కువగా ఆధ్యాత్మికముగ నుండవచ్చును. భారతీయ జీవితాదర్శమును గుఱించి విచారించుటకు ముందు, భారతీయత యొక్క జన్మస్థానమును, భారతదేశమును గురించి వివరించుట యుక్తము.

## భారతదేశము

అష్టాదశ పురాణములలో విష్ణుపురాణ మతి ప్రాచీన మైనది. ఇది క్రీ. శ. రెండవ శతాబ్దములో రచింపబడిన దని చెప్పబడుచున్నది. ఈ పురాణములో సప్తద్వీప వివరణ కలదు. జంబూద్వీపము సప్తద్వీపములలో నొకటి. భారతవర్షము, లేక భారతదేశము, జంబూద్వీపములోనిదే. దీని వివరణ, ప్రశస్తి విష్ణు పురాణములో నున్నవి.

భారతవర్షములో రూపొందిన సంస్కృతిని జనసామాన్యము "హిందూత్వము" (Hinduism) అని చెప్పుకొనుట పరిపాటి ఆయెను. కాని. "హిందూ", మఱియు "ఇండియన్" (Hindu and Indian) అను పదములు, "సింధూ" అను పదమునుండి వచ్చినవనియు, ఆర్యులు మొదలు నివసించిన "సింధూ" నదిప్రదేశమునుండి ఈ మాట ఉత్పన్నమైనదనియు చెప్పుదురు. 'హింద్' అనునది పారసీకము (persian) నుంచి 'ఇండో' (Indo) అనునది గ్రీకు భాషనుండి వచ్చి, యీ మాటలు' హిందూ' (Hindu) మఱియు 'ఇండియన్' (Indian) అనునవి విదేశీయు లిచ్చిన పేర్లని కూడ తెలియుచున్నది. ఇంకను, విదేశీయులు, సింధూనది ప్రదేశమునకు యీవలనుండు దేశమును 'హిందూస్థాన్' (Hindusthan) అని అపశబ్దముతో పిలువ దొడగిరి. అటులనే 'హిందూ' అను పదము 'ఇన్డ్' (Ind) గా మారి, దీనినుండి భారతదేశము 'ఇండియా'

(India) గా మారినట్లు చెప్పబడుచున్నది. ఏమైననేమి, భారతవర్ష మను మహోన్నత దేశము 'ఇండియా' (India) యని యీ మాతృభూమిలో నివసించువారి సంస్కృతి 'హిందూ' లేక 'భారతీయ' సంస్కృతి యని పేరెన్నిక నొందెను.

నిజస్థితిలో 'హిందూ', మఱియు 'ఇండియా' అను పేర్లు భారతదేశపు పూర్వకాల వాఙ్మయములో గాని, ఆధ్యాత్మిక రచనలలోగాని కానరావు. సంస్కృత వాఙ్మయములో యీ దేశమును భారతవర్షమనియు 'ఆర్యావర్త' మనియు, ఇందులో నివసించువారిని 'ఆర్యజాతి' యనియు వీరి సంస్కృతిని ఆర్యధర్మ మనియు, సనాతనధర్మ మనియు వర్ణింపబడినది భారతదేశములో వెలుగొందిన ప్రాచీన వేదోపనిషత్తులు, ఆ తరువాత వెలువడిన ఆధ్యాత్మిక గ్రంథరాజములు, రామాయణ భారత ఇతిహాసములు, పురాణములు, కావ్యములు, వీటి కనుగుణముగ రూపొందిన మత, రాజకీయ, ఆర్థిక, నైతిక, సాంఘిక సంస్థలు, వివిధ కళలు, రాజ్యములు ఇవన్నియు, ఆధ్యాత్మికపు బునాది కలిగినవై, ఆర్యధర్మమందు పరిణతమొంది భారతీయతగా రూపొందిన సంస్కృతి నాగరికతలుగ పరిగణింపబడుచున్నవి. మనమిపుడు, భారతీయ లేక హిందూ సంస్కృతి యొక్క వివిధరూపములు, రేఖలు, శ్రేణులు, నాగరికత, జీవితవిధానము, మహోన్నతి మొదలగువానితో గూడిన ఆర్యధర్మమును గుఱించి విచారింతము.

# భారతీయ జీవితాదర్శములు

పరిణామక్రమమున జడము నుండి శరీర ప్రాణ మనోరూపము నొందిన మానవుడు కేవల భౌతికప్రకృతికి బద్ధుడైన జీవుడు కాడు. అతడు శరీర ప్రాణ మనస్సుల నుపయోగించు ఒక ఆత్మ. చైతన్యము, ఆత్మ, ఇవి జడముకంటె భిన్నమై, జడము నుత్పన్నముజేసి, వశపరచుకొని, జీవితములో స్వతంత్రతతో విహరించుచున్నవి. హిందువు ఆధ్యాత్మికతను జీవితలక్ష్యముగా జేసికొని, జీవితమంతటిని ఆధ్యాత్మికముగజేయ సమకట్టును ఈ స్థితిని బొందుట కనేకమార్గము లున్నవి. అత డేమార్గ మవలంబించినను, భగవదైక్యత నొంది, స్థితప్రజ్ఞుడై, ప్రపంచములో జీవయాత్ర నడిపించును.

వ్యక్తులు వారి అనుభవముల ననుసరించి వేరువేరు మార్గముల నవలంబించినను, తుదకు గమ్యస్థాన మొకటియే యని అందరు ఒప్పుకొని దీనిని చేరుటకు ప్రయత్నించవలెను. ఒక వర్గమువారు జీవుడు, పరమాత్మ, ఒకటే యనియు, ఇంకొకరు వీరు వేరనియు, మరియొకరు జీవాత్మ పరమాత్మ ఒకటిగా నున్నను వేరనియు, ఇట్లు త్రిమార్గముల బోధించి, ఆయా మార్గములలో నడచినను, మార్గముల నన్నిటిని సమన్వయపరచి, సత్యమొక్కటియే యని, వేదఋషుల శృతివాక్యము 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి,' అని దృఢపరచిరి. ఈ సత్యము నితర దేశములలో ఏ కొందఱు మహనీయులలో నుపలబ్ధి పొందినను, జనసామాన్యమున

క్కీ సత్యము దృఢపడలేదు. కాని, భారతదేశములో ఈ సత్యమును జనసామాన్యము తఱచుగా గ్రహించి,ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించుచున్నారు. వీధిలో నడచు సామాన్య భారతీయుడు సహితము, 'మాయ' 'లీల' 'సర్వత్ర భగవానుడున్నా' డనుట మొదలగు మతతత్త్వముల నవలీలగా తెలిసికొన్నవాడే. ఈ తత్త్వముల యొక్క సత్యము భారతీయుని మతములోను, వాఙ్మయములోను కళలందును, జీవితములోను, ప్రజల గేయములందును ఉట్టిపడుచుండును. హిందువు లెప్పుడును మతము పేరట యుద్ధములు చేసి, వేరు మతముల వారిని హింస పెట్టి, వారిని చంపి, రక్తపాతములు గావించలేదు. బౌద్ధులు, జినమతస్థులు, చార్వాకులు, విదేశీయులు హిందువులలో కలిసి నివసించుచు, అన్యోన్యముగ మెలగుచుండిరి.

కాని పాశ్చాత్య దేశములలో మతము నియమబద్ధమై కొన్ని నిర్ణయములకు కట్టుబడి, ప్రత్యేక ఆచార సంస్కారములకు లోనై వీని నుల్లంఘించినవారు ప్రమాదములకు, శిక్షలకు గుఱియగుచుండిరి.

## హిందూ మతము

హిందూమత మన నేమి ? అదేమి బోధించును, ఏమి ఆచరించమనును ? దాని సామాన్యపద్ధతు లేవి ? వీని సమాధానములు చూడుడు.

ప్రథమమున, 'ఏకం సత్ బహుధా వదంతి' అనగా. అనంతము, సనాతనమునైన సత్య మొక్కటే. దీనినే, బౌద్ధులు నిత్య మనియు, శంకరాద్వైతులు కేవల మనియు, ద్వైతులు భగవానుడనియు, వేర్వేరు విధములుగ జెప్పుచుందురు. రెండవది, ఈ అనంతము, అఖండము, అనేక అనంతములు, అఖండములతో నిండియున్నది. ఇవన్నియు కూడ ఆ సనాతనమే. ప్రపంచములో అనంతము హద్దులు కల్గినట్లుగ నున్నను ఇవన్నియు కూడ ఆ అనంతమే యని తెలిసికొనవలెను. ప్రకృతి వెనుక నున్న దేవతలందరు కూడ ఆ ఏకము యొక్క అంశములే యని తెలిసికొనవలెను. సృష్టించు బ్రహ్మగను, పోషించు విష్ణువుగను, నాశ మొనర్చు రుద్రుడు లేక శివుడుగ నా యనంతము సాక్షాత్కరించును. ఆ యనంతము యొక్క శక్తియే, దుర్గ, లక్ష్మి, చండి, కాళి మొదలగు దేవతలుగ నవతరించును. మూడవది, ఈయనంతమును విశ్వచైతన్యము ద్వారా పొందకలిగినను, దీనిని వ్యష్టిరూపముగ కూడ నుపలబ్ధి సంపాదింపనగును. మానవుడు అజ్ఞానమును దూరీకృత మొనర్చుకొని, తనలో నున్న అనంతమును పొందనగును.

హిందూమత మనునది ఒకటి లేదు. ఎందుకన, హిందూసంస్కృతి సనాతనధర్మము పైనాధారపడి యున్నది. ఇందులో ఒకే విశ్వాసములు గాని, ఇతర మతములలో నున్నట్లు మతాధిపతి గాని, ఒక మత సంఘము, సంఘ నియమావళి, నిర్ణయములు, అధికారవర్గము మున్నగున వేమియు లేవు. హిందువులలో అన్ని మతములవారు అన్ని విశ్వాసములవారు

మున్నారు. ఎవరికి తోచినట్లు వారు భగవానుని కొలువవచ్చు. అట్లు కొలువనివారి నెవరు శిక్షింపరు. హిందూమత మనుదానికి ఒక స్వరూపము, ఒక సిద్ధాంతము లేదు. పురోహితులు, పండితులు తమ ఆత్మానుభూతి, బుద్ధిబలము ననుసరించి శాస్త్రముల నుపయోగ పెట్టుకొనుచు, వ్యాఖ్యాన ములు చేయుచున్నారు. హిందువులలో, సగుణ, నిర్గుణ ఉపాసన లున్నవి. విగ్రహారాధన చేయువారు, నిర్గుణోపాసకులు ఒకరి నొకరు నిరసించుటలేదు. ఎవరి నమ్మకము వారిది. సగుణ, నిర్గుణముల కతీతులైన సర్వోత్కృష్టులు, అన్నిటియందు సామరస్యమును ప్రదర్శించు చున్నారు.

హిందువు లాచరించునది సనాతనధర్మము. సనాతనధర్మ మన భగవంతునిలో అందరున్నారనియు, భగవంతు డందరిలో నున్నాడనియు, సర్వము భగవానుడే ననియు తెలిసికొనుట, ఆచరించుట. ఈ ధర్మమాచరించు వారికి, సహజముగ సహనశక్తి గలదు, కావున హిందువు లనాదిగ సహనశక్తి నెక్కువగా కలిగినవారై, యితర మతస్థులు, మతముల పట్ల ఓర్పు, సహనము వహించి, ఎవరిని, దేనిని నిరసించక, యితరులలో నుండు సద్గుణములను మంచి పద్ధతులను తాము స్వీకరించి, సొంతము చేసి కొని, జీర్ణించుకొని, ఐకమత్యముతో జీవించుచున్నారు. భారతీయులది విశ్వహిందూమతము, వారి ఆశయము దివ్యజీవనము.

# హిందూ సంస్కృతి

హిందూ సంస్కృతి సజీవముగా నున్న అవయవి. ఇది అనేక శతాబ్దముల క్రింద పుట్టి, పెరుగుచు, ప్రగతినొంది, అభ్యుదయము పొందుచున్న చిరంజీవి. దీనిలో ననేక భావములు, నమ్మకములు, ఆశయములు, ఆచారములు, విధానములు, సంస్కారములు, పరిణతి నొందినవి. విదేశీయులు జొరబడి వారి నాగరికతను, సంస్కారములను బలాత్కారముగ వ్యాపింప సమకట్టినను, అందుకు లొంగక, క్రుంగక, క్రొత్త సంస్కృతిలోని సుగుణముల గ్రహించి, జీర్ణించుకొని, స్వధర్మ స్వభావముల విడనాడక, హిందూ సంస్కృతి ముందు కేగుచున్నది.

క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధ మతములవలె హిందువులది ఒక మతము కాదు. హిందువులు ప్రత్యేకమతమునకు, తెగకు చెందినవారు కారు. భారతవర్షములో అనేక మతములున్నవి. అన్ని మతముల యొక్క భావములు, విధానములు, హిందూ సంస్కృతిలో నున్నవి,

వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, దర్శనములు, పురాణములు, తంత్రములు, ఆగమములు, హిందువుల శాస్త్రములుగా పరిగణింపబడినను, పీని తర్వాత సంభవించిన మతగ్రంథములను కూడ హిందువులు పోషించు చున్నారు. వేదోపనిషత్తుల కాలము తర్వాత, అనేకమంది మహనీయులు

సరిక్రొత్త భావములను, ఆశయములను, పోకడలను రేకెత్తించి, దేశములో ప్రవేశపెట్టిరి. కాని వీని నన్నిటిని హిందువులు ఆకళింపుచేసికొని, సమాధాన పరచుకొని, వేదోపనిషత్తులలోని మూలభావముల కనుగుణముగా ప్రవర్తించుచు, దేనిని నిరసించక, ప్రగతి నొందుట కాననగును. హిందూమతములో ఒక సువిశాలత, గాంభీర్యము, ఔన్నత్యము సదా ప్రజ్వరిల్లుచుండును.

హిందూసంస్కృతి ఒక ప్రత్యేక రాజకీయ మార్గమునకు గాని ఒక ప్రత్యేక జాతికి, వర్గమునకు గాని, సంబంధించినది కాదు. ఇందులో అన్ని మార్గములు, జాతులు, వర్గములు, కులములు, సంఘము లున్నవి. భౌతికముగ చూచిన, బాహ్యముగ ఎన్నో భేదములు, ఘర్షణ లున్నట్లు కనపడినను, హిందూత్వములో సనాతనముగ నొక ఏకత్వము, ఐక్యత లున్నవి. హిందూవర్గములలో, తెగలలో కొన్ని సామాన్య విశ్వాసములు, ఆదరణలు, భక్తి శ్రద్ధ లున్నవి.

మొదటిది, వేదముల యందు గల శ్రద్ధా గౌరవ భక్తులు. వేదము లపౌరుషేయము లనియు, దివ్యశ్రుతిప్రవాహము లనియు, జ్ఞాననిలయము లనియు హిందువుల నమ్మకము.

రెండవది, పావనపురుషులగు జ్ఞానులు, భక్తులు వీరిపైన గురు భావము, భక్తి శ్రద్ధలు, కృత, త్రేతా ద్వాపరయుగ ఋషిపుంగవులైన,

అత్రి, కశ్యప, భరద్వాజ, విశ్వామిత్ర, వసిష్ఠ, గౌతమ,భృగు, అగస్త్యాదు లను కలియుగ మందలి బుద్ధ, శంకర, రామానుజ, మధ్వ, కబీర్, నానక్, తులసీదాసు,రామదాసు మొదలగువారిని, నవీన కాలపురామకృష్ణ,దయానంద, శ్రీఅరవింద, రమణ మున్నగు పావనపురుషులను, రాజర్షి వీరులైన శ్రీరామ కృష్ణ, భీష్మ, ధృవ, ప్రహ్లాదులను, మహాపతివ్రతలైన సీత, సావిత్రి, దమయంతి, మైత్రేయి, గార్గి మున్నగు స్త్రీరత్నములను, భక్తి నమ్రతలతో గౌరవించును. వీరి ఆదర్శ జీవితముల ననుకరింప ప్రయత్నించు చున్నారు.

మూడవది : తీర్థరాజముల యెడ గౌరవము భారతదేశములో అన్ని తెగలకు చెంది, వారిచే స్థాపింపబడిన తీర్థరాజము లున్నవి. అయోధ్య, మధుర, కాశీ, కంచి, అవంతి, పూరి, ద్వారక, రామేశ్వరము, తిరుపతి మొదలగు తీర్థస్థలములును, గంగా, యమున, బ్రహ్మపుత్ర, గోదావరి,కృష్ణ, కావేరి మొదలైన పవిత్రనదులును, హిమాలయ,వింధ్య, నీలగిరి, మున్నగు మహాపర్వతములు ఇవన్నియు హిందువుల నాకర్షించి, వారి ప్రకృతి రామణీయకతకు, రసజ్ఞానములకు దోహదకారు లగుచున్నవి.

నాల్గవది : వర్ణాశ్రమధర్మములు. హిందూ ఋషులు, మానవ గుణముల ననుసరించి, వారిని నాలుగు తరగతులుగ విభజించిరి. వర్ణ మన గుణము. మానవునిలో నాలుగు ప్రధాన గుణము లున్నవి. మొదటిది : చింతన, విద్య, పాండిత్యము; రెండవది : శక్తి, వీర్యము, నాయకత్వము,

ప్రజాపాలకత్వము, యుద్ధము చేయుట; మూడవది : ఆర్థికబలము, ధనార్జనము, ధనధాన్యముల సేకరణ, వినియోగము, నాల్గవది : సేవ, పరిచర్య, కృషి ఈ నాలుగు విధముల గుణములు కలవారిని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర. తరగతులుగ విభజించిరి. బ్రాహ్మణతరగతివారు దేశమునకు గురువులు, ఆలోచనాపరులు, మంత్రులు, బోధకులు. క్షత్రియ తరగతివారు రాజులు, యుద్ధవీరులు, రాజ్యపాలకులు, ప్రజా పోషణ సల్పువారు. వైశ్య తరగతివారు వ్యాపారులు, ధనవంతులు. శూద్ర తరగతివారు కృషీవలులు, సేవాతత్పరులు, నౌకరీ పనులకు యోగ్యులైనవారు. భారతీయు లీ విభజన, వ్యక్తుల గుణములను, శక్తినిబట్టి చేసిరి కాని, పుట్టుకనుబట్టి కాదు. ప్రతి మానవునిలోను, ఈ నాలుగువిధము లైన గుణము లున్నవి. మానవుడు బుద్ధిబలముతో బ్రాహ్మణుడుగను, బాహువీర్య రాజనీతి ధురంధతలతో క్షత్రియుడుగను, ధనార్జన, వ్యాపార, చతురత, శక్తులతో వైశ్యుడుగను, సేవాతత్పరతతో శూద్రుడుగ నున్నారు. హిందూ సంఘములో ఈ వర్ణవిభజన చాలకాలము వరకు ఆచరణలో నుండి, ప్రజలు వారి వారి గుణానుసారము దేశక్షేమమునకు తోడ్పడుచు, ఐకమత్యముతో ఒకరి కొకరు సహాయపడుచు, జీవించుచుండిరి. శ్రీరాముని పూర్వీకులైన, దిలీప, రఘు మొదలగు రాజన్యులు దేశమును సక్రమముగా, వర్ణాశ్రమ ధర్మములతో పాలించుచుండిరని, కాళిదాస రచిత రఘువంశ మహాకావ్యమువలన తెలియవచ్చుచున్నది శ్రీరాముని తండ్రి అయిన దశరథుడు, శ్రీరాముడు వారి పూర్వీకుల ననుసరించి, ధర్మరాజ్యములను స్థాపించి, ప్రజల నేలుచుండిరి. తరువాత, వర్ణ

సాంకర్యము కలిగి, ధర్మలోపము కలిగెను, ఇందుకు ఫలితముగా భారత యుద్ధము సంభవించెను.

హిందూ సంస్కృతిలో వర్ణ ధర్మమునకు తోడుగ ఆశ్రమధర్మము కూడ ఆచరణలో నుండినది. మానవ జీవితము నాలుగు సహజావస్థలతో సాగినట్లుగా, రఘువంశ కావ్యమువలన తెలియనగును. మొదటిది: బ్రహ్మచర్యజీవనము, ఇది విద్యార్థిదశ. రెండవది: గృహస్థజీవనము. ఈ సమయములో జీవుడు వివాహితుడై, సంతానమును బడసి, మానవ, సంఘక్షేమ సేవలకు తోడ్పడుచుండెను. మూడవది: వానప్రస్థ జీవనము. ఈ దశలో దేశము నంతట తిరుగుచు, సంసారమును వదలి, ఇతరుల క్షేమమునకు పాటుపడుచు, సేవాతత్పరుడై, జీవుడు జీవనయాత్ర నడుపును. నాల్గవది: సంన్యాసాశ్రమము. ఈ స్థితిలో, మానవుడు విరాగియై, పరివ్రాజకుడుగ సంఘనియమముల కట్టుబాట్ల కతీతుడై, బ్రహ్మనిష్ఠుడై యోగాభ్యాసము చేయుచు, జ్ఞాన ప్రబోధకుడై, బ్రాహ్మీస్థితిబొంది, జీవన్ముక్తుడగును.

పూర్వకాలమున, భారతదేశములో ఈ ఆశ్రమధర్మములు సక్రమముగ సాగుచుండి, అచరింపబడుచుండెడివి. వ్యక్తి విద్యార్థిదశలో కఠిన బ్రహ్మచర్యవ్రతము నవలంబించి అన్ని విద్యలు, కళలు, గురుకులములో గురువుకడ నభ్యసించుచు, గురుసేవాతత్పరు డగుచుండెను. పిమ్మట, గుర్వనుజ్ఞపొంది, గృహస్థాశ్రమము స్వీకరించి, ధర్మ, అర్థ, కామముల

నాచరించుచు, దేశ, సంఘ క్షేమమునకు పాటుపడుచు, తరువాత కుటుంబ, సంఘ, కట్టుబాట్ల కతీతుడై వానప్రస్థాశ్రమము స్వీకరించి, తుదకు ఏకాకిగా ఎల్లెడల తిరుగుచు, యోగనిరతుడై బ్రాహ్మీస్థితి నొంది యితరులకు జ్ఞానదీక్ష నొసగుచు, సంన్యాసాశ్రమనిరతు డగుచుండెను. కాని, ఈ ఆశ్రమజీవితము, అందరికి తప్పనిసరి కాదు. అనేకులు మొదటి రెండాశ్రమముల కావల పోలేదు. పెక్కుమంది వానప్రస్థులుగ గతించినారు. పలువురు నాల్గవ ఆశ్రమము చేరకలిగి, బ్రహ్మసాయుజ్యము పొందినారు.

హైందవ సంస్కృతీ నాగరికతలలో, ఈ వర్ణాశ్రమధర్మములు ఘనత వహించి, శ్రేయోదాయకముగా నుండిన వని చెప్పక తప్పదు. నిజస్థితిలో సర్వమానవులు, ఈ ధర్మములను పాటించి, ఆచరణలో బెట్టినచో మానవ కల్యాణ భద్రతలు తప్పక చేకూరునని చెప్పవచ్చును.

రామాయణకాలము గడచిన తర్వాత, దేశములో అర్థకామములకు ప్రాముఖ్యము కలిగి, ధర్మము లోపించెను. మహాభారత యుద్ధకాలములో యుధిష్ఠిరుడు ధర్మసంస్థాపనకు ప్రయత్నించెను. అప్పటినుండి నేటివరకు ధర్మము క్రమముగా లోపించి, తత్ఫలితముగా జాతివైరములు, యుద్ధములు ప్రజాసంక్షోభములు, అశాంతి, ప్రపంచము నందంతట గాంచుచున్నాము.

వర్ణాశ్రమ ధర్మములకే గాక, భారతదేశములో స్త్రీల పాతివ్రత్యమున కెక్కువ ప్రాముఖ్య మివ్వబడినది. స్త్రీలలో నీతి లోపించిన, సంఘము

చెడుననియు, అందువలన పాపములు సంభవించుననియు హిందూధర్మ శాస్త్రము చెప్పును. కుటుంబ సౌఖ్యమునకు స్త్రీ కారణభూతురాలు. స్త్రీలు శీలము కలిగి, నీతివంతులైనచో, వారివలన సత్సంతానము కలిగి దేశము క్షోభరహితమై కల్యాణప్రదముగ నుండగలదు. ఆదర్శభార్యగను, ఆదర్శ మాతగను పరిగణింపబడుట గొప్ప భాగ్యమని హిందూసంస్కృతి చెప్పును.

భారతీయులు గోసంరక్షణ కెక్కువ ప్రాధాన్యము నిచ్చి, గోవును మాతగా నెంచి పూజించుచుండిరి. అటులనే బ్రాహ్మణులకు గౌరవ మిచ్చిరి. "గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యమ్" అనగా, గోవులు బ్రాహ్మణులు శుభముగా నుండవలెనని భారతీయుల నిత్యప్రార్థన. యాజ్ఞవల్క్యఋషివంటి మహాత్ములకు, జనకమహారాజువంటి చక్రవర్తులు, గోవులను విరివిగా దానముచేయుట, రామాయణ, భారతములలోను, ఉపనిషత్తులలోను గాంచుచున్నాము. పాడిపంటలు సమృద్ధిగా నుండుటకు, చక్కని గోవులు, వృషభములు అత్యవసరమని చెప్పనక్కరలేదు. గోరక్షణకు, వృషభ పోషణకు హిందూ సంఘములో అత్యున్నత స్థాన మివ్వబడినది. వ్యవసాయాభివృద్ధికి, గోవృషభ సంరక్షణ, పోషణ అత్యవసరమని అందరికి తెలిసినదే. కాన, వీటిని సంహరించి, ఆహార మున కుపయోగించుట శ్రేయోదాయకము కాదని భారతీయుల మతము, ధర్మము.

# సనాతన ధర్మము

దేవుడొకడే యనియు, ఆయననుండి సర్వసృష్టి కలుగు ననియు, ఆయనయే సృష్టి, స్థితి, లయకారు డనియు, సత్కర్మానుష్ఠానము వలన, జీవు డనేకజన్మల పిదప, పునరావృత్తి లేని విముక్తి పొందు ననియు, సత్కర్మలు చేసినవారు సుఖముపొందుదు రనియు దుష్కర్మలు చేసినవారు బాధలకు, దుఃఖములకు గుఱి యగుదు రనియు, సత్కర్మలు, సత్సాంగత్యము జీవితమును సుఖవంతము చేయుననియు, ప్రపంచము సనాతనముగ ఒక దివ్యశక్తిచే నడిపింపబడుచున్న దనియు, సర్వము భగవానుడనియు, యిదియే సనాతన ధర్మమనియు హిందువులు నమ్ముచున్నారు.

హిందువులలో ఎన్ని తెగలున్నను, ఎన్ని మతములున్నను వారెన్ని దేవతలను కొలిచినను, ఎన్ని భేదాభిప్రాయములు కలవారైనను, ఒక మహోన్నత ఆధ్యాత్మిక ఐక్యత గలదనియు, అదియే సర్వమును కాపాడు చున్నదనియు హిందూశాస్త్రము చెప్పుచున్నది. హిందూమతము, సంస్కృతి, ఎన్ని బాధలకు, మార్పులకు గుఱి అయినను, ఈ నాటికి కూడ వినాశము నొందక, చిరంజీవియై శోభిల్లుచున్నది.

మానవునిలో ద్వివిధ చైతన్యము కలదు. అతనిలో నుండి వ్యక్తిగతచేతన అతనిని అనేక వ్యక్తులలో నొకడుగను, అహంకార పూరితుడై తన సౌఖ్య సంపదలకొరకే జీవించువాడుగను, ఈ సౌఖ్యమున కడ్డువచ్చువారితో పెనగులాడు వాడుగను, ప్రపంచములో నతడు వేరుగా నున్నట్లును, తోచునట్లు చేయును. కాని, మానవునిలో ఒక దివ్యచేతన కూడ కలదు. ఇందువలన, ప్రపంచములో నితరులతో కలిసి మెలిసి యుండుటకు వలయు చైతన్యమును అతనిలో కలుగజేసి, మానవకోటి, పశుకోటి యందును, జగత్తులోని వృక్ష, ఖనిజ, భౌతికవస్తువు లన్నిటి యందును గల విశ్వచేతనాప్రేమలను విలసిల్లజేయును. మానవు డీ విధముగ ఏకత్వ బహుత్వములలో నివసించుచున్నాడు. ఎప్పు డాతడు వీని యందు గల సామరస్యము యొక్క ఉపలబ్ధి పొందునో, అప్పు డతడు నిర్మల సుఖశాంతులతో వర్ధిల్లి ఆనందమయు డగును.

తనలో నాత్మసాక్షాత్కారము పొందినపుడు, మానవుడు ప్రపంచములో కూడ, అనగా సర్వమానవకోటి యందును, జంతు వృక్షజాలము నందును, పర్వతములు, నదులు, గ్రహములు, నక్షత్రములు, సూర్యచంద్రాగ్నులలోను, ఎల్లెడలను దివ్యచేతనోపలబ్ధి పొందును. అట్టితరి, అతనికి సర్వత్ర ఏకత్వము గోచరించును. తద్ద్వారా అతనిలో విశ్వప్రేమ కలిగి, అతడు సర్వమును ప్రేమించి ఆనందమయు డగును.

'ధారణాత్ ధర్మ మిత్యాహుః' ధర్మమనగా ఏకముగా చేయునది, ధరించునది. జగత్తులోని వివిధ వస్తుచయమును, వ్యక్తులను బహుత్వము

అహంకారము, ద్వేషము, భేదము మొదలగు వానినుండి విడదీసి ఐక్యత కలుగజేసి ప్రేమానందములు ప్రసాదించునదియే ధర్మము. పరస్పర ప్రేమ, సేవ,సహకారము, అహింస, వీని ద్వారా ధర్మము వర్ధిల్లుచున్నది. ఏది ద్వేషము, విరోధము, యుద్ధము కలిగించుచున్నదో అది యధర్మము. మానవుని తలంపులు, భావములు, వాక్కులు, క్రియలు, ధర్మానుసారముగ నున్నచో శాంతి, సమత్వము, సౌఖ్యము, వానికి సిద్ధించును వ్యక్తిగతముగనే గాక సంఘములోను, వివిధ దేశ జాతులలోను, సర్వత్ర యీ భావములు నెలకొల్పినచో, ధర్మము వర్ధిల్లి ప్రపంచములో ధర్మ జీవనము విలసిల్లును.

ధర్మము యొక్క లక్ష్యము, మానవసంఘములోనే గాక, ప్రపంచ మునందంతటను,ఏకత్వము యొక్క ఉపలబ్ధిపొందుటయే.అప్పుడు బహుత్వముగా కనబడుచున్న ప్రపంచములో ఏకత్వము గోచరించి, జగత్తంతయు సజీవ నిర్మాణమనియు, ఒక దివ్య సత్త యొక్క సృష్టి యనియు, సర్వ మానవులు జంతువులు,చరాచరజీవకోటి అంతయు ఒక అనంత,అఖండదివ్య శక్తిచే నడిపింపబడుచున్నదనియు ఉపలబ్ధి కలుగును. ఆత్మసాక్షాత్కారము పొందిన ముక్తపురుషుడు ఉపనిషత్తులో చెప్పినట్లు బ్రహ్మమును పైనను, క్రిందను, కుడిప్రక్కను, ఎడమ ప్రక్కను,వెనుకను, లోనను, బయటను, ఎల్లెడలను గాంచును. అతడపుడు సంశయరహితుడై, రాగభయక్రోధముల నుండి విముక్తుడై బ్రాహ్మిస్థితి పొందును. అట్టివానికి శోకమోహము లెక్కడివి? ఈ స్థితిని పొందుటకే అన్ని మతములు, శాస్త్రములు

బోధలు- వీని యొక్క ప్రయత్నము. మానవత్వములో దివ్యత్వమువల్లి పొందుటయే ధర్మము యొక్క లక్ష్యము. సనాతన ధర్మమే దివ్యజీవనము నకు మార్గదర్శి.

## హిందూమతము యొక్క ఆదర్శము

సచ్చిదానందమగు పరమాత్మను వివిధ మతములవారు నానా విధ నామములు,రూపములు,తలంపులు, భావములతో నారాధించుచున్నారు. సత్య మొక్కటియే కాని,అది మానవదృష్టికి నానావివిధముల గోచరించుచున్నది. పరమాత్మ తాను అనేక మయినపుడు, దానినుండి వివిధ చరాచర సృష్టి కలుగుచున్నది. దీని కంతయు దేవత లధిపతులై, లోకముల పరిపాలించు చున్నారు.

మహాయోగులు, జ్ఞానులు, భక్తులు నామరూపముల కతీతులై పరమాత్మోపలబ్ధి పొందవచ్చును. కాని, సామాన్యజనులకు దేవతారాధన అత్యావశ్యకము. ఈ దేవతలను విధివిహితముగా పూజించి, తుదకు వీరి కృపవలన పరమాత్మను చేరవచ్చును. ఆ పరమాత్మ బ్రహ్మ,విష్ణు, మహేశ్వరులుగను, రామ, కృష్ణ, బుద్ధ, కాళి, దుర్గ, మహేశ్వరి, అల్లా జుహోవా, ఆహూర్మజ్డ, లేక ఏ పేరుతోనైనను, ఆరాధించవచ్చును. ఈ పూజాఫలితముగ జ్ఞానోదయ మైనపుడు, జీవుడు ప్రపంచము నందంతటను, చరాచరములలో, పృథ్వి, అప్,తేజో వాయురాకాశములలో

ఒకే దేవుని కనుగొనుచున్నాడు. అప్పుడు భేదభావములు నశించి,మానవుడు ముక్తుడై పరమానందభరితుడగును.

హిందూమతస్థుడన్ని మతముల వారిని సహనభావముతో చూచి వారి కన్ని విధముల తోడ్పడి, మైత్రితో మెలగుచుండును. తన మతమే గొప్పదనియు, ఇతర మతములు తక్కువ యనియు భావించి ఏ మతమును విరోధించక అందరియెడ సమభావము కలిగి యుండును.

దొరతనములు కూడ, ఒకే మతముపై పక్షపాతము వహింపక, అన్ని మతములపైన సమభావము కలిగి అందరిని ఆదరించవలెను. ప్రభుత్వములు, అన్నివర్గములవారిని తెగలవారిని సమదృష్టితో జూచుచు, అందరిలో సంఘీభావము, ఐకమత్యము, కలుగజేయు పద్ధతుల, విధుల, నేర్పరచి, రాజ్యపరిపాలనము గావించవలెను. హిందూమతము యొక్క ఆశయ మిదియే.

## హిందూదేశ ఋషులు, పావనపురుషులు

అనాదినుండి భారతీయసంస్కృతికి, నాగరికతకు, మూలపురుషులు ఆ దేశములోని ఋషులు, పావన పురుషులు, ఋషులనగా సత్యమును కనుగొని, సత్యవంతముగా జీవించుచు, తమ క్షేమమునకే గాక, అన్ని లోకముల, ప్రజల, జీవకోటి కల్యాణ క్షేమ భద్రతలకు పాటు బడుచు,

వీని నెల్లెడల స్థాపించు పుణ్యపురుషులు. వీరు ధర్మార్థ కామమోక్షముల రూపములను, విధులను, ప్రజానీకమునకు తెలియజేసి, మానవుడు కేవల మనఃప్రాణ శరీరములు మాత్రము గల జీవికాడనియు, నిర్మలాత్మస్వరూపు డనియు, దివ్యజీవనమును నలుపు మార్గమును వారు బోధించినారు. సనాతన ధర్మ సత్యముల నిరూపించుటకు ఋషులు ఆదర్శప్రాయులై జీవితములో కష్టసుఖములను తాము అనుభవించి, వీని కేవిధముగ నతీతులు కావచ్చునో, ఆ మార్గములను చూపించినారు. ఈ మహనీయులు దేశ కాలముల కనుగుణముగా ఒకప్పుడు నిర్జన స్థలములలోను, మఱొకప్పుడు జనసామాన్యములోను నివసించుచు. సాధారణవ్యక్తులకే గాక, రాజులకు, సంఘములకు, అందరికి హితముజెప్పుచు, సలహాల నిచ్చుచు, తోడ్పడినారు. మానవజాతి సామాన్యముగా బుద్ధిబలము దేహబలము గలవారిచే పరిపాలింపబడుచున్నది. కాని, భారతదేశములో, పావనపురుషులకు ప్రాధాన్య మివ్వబడి వీరి సలహాలను రాజన్యులు కూడ పాటించినారు. ఋషులు త్రికాలదృష్టి కలవారనియు, వీరి కన్నియు కరతలామలకము లనియు వీరిని దర్శించి సర్వులు వీరి నాదేశముల పాటించుచుండిరి.

రామాయణ, మహాభారత యుగములలో, రాజులకు, ప్రజానీకమునకు, వసిష్ఠ, విశ్వామిత్ర, వామదేవ, పరశురామ, భరద్వాజ, యాజ్ఞవల్క్య, ధౌమ్య, భీష్మ, ద్రోణ, వ్యాస, శుక, అగస్త్య, నారద, మొదలగు అనేక ఋషిపుంగవులు, రాజ్యపరిపాలనయందే గాక, యితర ఐహిక, ప్రాపంచిక

విషయములలో కూడ, అందరికి తోడ్పడుచుండిరి. ఈ కాలములో కూడ, ప్రజలు పావనపురుషులవద్దకు పోయి, వారి కష్టసుఖములను గూర్చి చెప్పు కొనుచు, సహాయము పొందుచున్నారు.

## భారత సాహిత్యము, వాఙ్మయము

సాహిత్యము యొక్క ఔన్నత్యము, వస్తుశ్రేష్ఠత, గంభీరభావము. అది సృష్టించిన రూపములయందు యుండును. ఇంకను, ప్రజానీకము నెంత వరకు ఉన్నత స్థితికి అది గొనిపోవునని కూడ ఆలోచింప తగినది. వాఙ్మయ భాష, మధురము, స్నిగ్ధము, సరళముగ నుండవలెను. ఈ ప్రమాణములను బట్టి చూడ, భారతీయ మూలభాష సంస్కృతము, ప్రదేశభాషలైన హిందీ. బంగాళా, గుజరాతీ, ఆంధ్ర, కన్నడ, తమిళ మొదలగునవియు, బౌద్ధ పాళీభాషయును, ఇవన్ని భారతీయ నాగరికతా సంస్కృతులకు అభ్యుదయకారులైనవి.

వేదోపనిషత్తులు మంత్రద్రష్టలైన ఋషిపుంగవుల స్వతఃస్ఫురణ శ్రుతిప్రవాహవాక్యములు, ఈ కవిత మనోభూమిక కూర్ధ్వమునుండి వెల్లి విరసిన అమృతవాణి. రామాయణ, మహాభారత రచయితలైన వాల్మీకి, వ్యాసులు, తరువాత రాణించిన కాళిదాసు మూడు యుగములకు చెందిన మహాకవులు. వీరి మహాకావ్యములలో భారతీయ సంస్కృతి అత్యుత్తమ స్థానము వహించినది. ఈ రచనలను పరిశీలించినచో, భారతీయనాగరికతా

ప్రాశస్త్యము విశద మగుచున్నది. వ్యాసమహర్షి రచించిన మహాభారతము పంచమ వేదమని వన్నెకెక్కినది. సమస్త విషయములను గుఱించి, యిందులో వర్ణన లున్నవి. ఆధ్యాత్మిక, నైతిక, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, లౌకిక సర్వవిషయములు ఈ కావ్యములో చర్చించబడినవి. ఇది సర్వులు వినియోగింప తగిన ఉత్తమ ఆదర్శ గ్రంథము.

కాళిదాసమహాకవియే గాక భవభూతి, భారవి, బాణ, భర్తృహరి, జయదేవ మున్నగు సంస్కృతకవులును, తరువాత ప్రాంతదేశీయ భాషలలో వర్ధిల్లిన, విద్యాపతి, కబీరు, తులసీదాసు, సూరదాసు, నానక్,పోతన, శ్రీనాథుడు మున్నగు అనేకమంది కవులును, సాహితీరచనలలో వేదాంత విషయములను గుఱించియేగాక ఆ కాలపు రాజకీయ, ఆర్థిక, నైతిక పరిస్థితులను గుఱించియు పలువిధములైన నాగరికతావ్యవస్థలను వర్ణించినారు. ఇవన్ని పరిశీలించినచో భారతీయు లెంత ప్రతిభావంతులో, ఎంతటి మహానాగరికతా సంస్కృతి కలవారో విశదమగును. భారతీయ సాహిత్యముత్తమ మైనదనియు, ఏ దేశ సాహిత్యమునకు తీసిపోవునది కాదనియు చెప్పనగును.

భారతీయ సాహిత్యము, పద్య, గద్య, నాటక, కథా, కావ్య, నవల మొదలగు అనేక రూపములతో భాసిల్లు చున్నది. సాహిత్య మొక మహోన్నత కళ.

# భారతీయ కళలు

భారతీయులు అరవైనాలుగు కళలను సృష్టించి, పెంపొందించిరి. వానిలో ముఖ్యమైన లలితకళలు, తర్కము, వ్యాకరణము, న్యాయశాస్త్రము, జ్యోతిషము, ఆయుర్వేదము, సాహిత్యము, సంగీతము, నృత్యము, చిత్రకళ, శిల్పము, గృహనిర్మాణము. భారతీయుల కళాదృష్టి ముఖ్యముగ ఆంతరికముగ నున్నది. కాని, పాశ్చాత్యులు బాహ్యరూపమునకు ప్రాధాన్యమిచ్చుచున్నారు. ఈ దృష్టిభేదమువలన పాశ్చాత్యులు భారతీయ కళల యందలి గుణములను చక్కగా గ్రహించలేక వాటిలో నున్న సౌందర్యమును, గభీరతను, అంతరార్థమును మెచ్చుకొనలేకున్నారు.

పాశ్చాత్యులు భౌతిక సౌందర్య ఆకారములకు ముగ్ధులై వస్తువులలో నున్న రసజ్ఞత నుపలబ్ధి పొందలేక యున్నారు. భారతీయ చిత్రకారులు ప్రకృతి యందును, మానవునిలోను, జగత్తునం దంతటను ఆత్మదృష్టి కలవారై ఆంతరిక విశేషములను బాహ్యరూపములలో చిత్రించ ప్రయత్నించినారు. దేవతలు, ఋషులు వారిలోనుండు శాంతి, ఆనందము, దివ్యత్వము మొదలగు సచ్చిదానందములను, భారతీయ చిత్రకారులు వారి చిత్రములలో నిరూపించి యున్నారు. అటులనే, మానవ స్వభావములోగల శాంతి, కరుణ, క్రోధము మొదలగు నవరసములను బాహ్యరూపములలో చిత్రించినారు.

చిత్రలేఖనములోవలె, శిల్పములలో కూడ, భారతీయులు అంతర్దృష్టిచే నుపలబ్ధి పొందిన దివ్య భావములను, మానవ స్వభావములను, విగ్రహములలో కూడ ప్రదర్శించినారు. దేవాలయ కట్టడములలో, అన్ని లోకములు, అందుండు దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, రాక్షస, మానవ, పశు, తరు గుల్మాది సర్వగుణములను రాతిలో చెక్కినారు. రామాయణ భారత కథలు పౌరాణిక గాథలు విగ్రహ రూపములుగ దేవాలయపు ప్రాకారములలో చెక్కబడినవి. విగ్రహములను, రాయిలోను, ఇతర పంచలోహములలోను అద్భుతముగా నిర్మించు కళాకౌశలము భారతీయుల కున్నది. దేవాలయములలోనే గాక, రాజభవనములలోను, నిర్జనరమణీయ ప్రకృతిసౌందర్య స్థలములలోను గృహములలోను నిపుణతతో చెక్కబడిన శిల్పములు అనేకముగా నున్నవి.

నిర్వాణ శాంతిని ప్రదర్శించు ధ్యాన బుద్ధుని విగ్రహములను జూచినపుడు, మనము తన్మయులమై ఆ దివ్యభావముల నుపలబ్ధి పొందుదుము. అదేవిధముగ, మహాకాళి, శివ, దుర్గ, రామ, కృష్ణ మొదలగు విగ్రహములను దర్శించినప్పుడు వాని యందుండు దివ్యగుణముల నవగాహన జేసికొని, భక్తిభావముతో పూజింతుము. ఈ మహాశిల్పములు సృష్టించినవారి పేర్లుకూడ మనకు తెలియవు. ఐనను, వారి నైపుణ్యమును కొనియాడి, వారికి జోహారు లర్పింతుము. అజంతా గుహాలలోని చిత్రలేఖనములు,

వీనిని నిర్మించిన, బౌద్ధభిక్షువుల పేర్లు మన కగోచరములు. భారతీయశిల్పములు, చిత్రరూపములు స్వార్థరహితముగ సృష్టింపబడిన కళాకౌశలములు. సంగీత నృత్యకళలలో కూడ, భారతీయులు ప్రపంచములో ప్రసిద్ధి పొందినారు. సామవేదము, దివ్య గానామృతమై శోభిల్లు చున్నది. వేదకాలమునుండి యీనాటివరకు భారతీయులు సంగీత విద్య నభ్యసించి, అనేకవిధ గాయకులు ప్రజలకు శాంతి, ఆనందముల నందించుచున్నారు. సంగీతములో కూడ అన్ని రసములు అవగాహన చేయబడుచున్నవి.

సంగీతము వలె నృత్యకళ అనాదిగ నభ్యసింపబడి, సర్వజన మనోరంజకముగా, పోషింపబడుచున్నది. దీనిని గంధర్వ విద్యయందురు భారతీయులు సంగీత, నృత్యప్రియులు, నాటక కళలో సంగీత నృత్యములు రెండు ఇమిడి యున్నవి. ప్రజల జీవితము నుదాత్తముగజేసి, వారికి సుఖ ఆనందములు కలుగ జేయుటకు, నాటక ప్రదర్శనము లెంతో ఉపయోగపడుచున్నవి. అనాదిగా నాట్యకళ, సంగీత సాహిత్య నృత్యకళలు ప్రభుత్వములు, ప్రజానీకముచే ఆదరింపబడి, పోషింపబడుచున్నవి.

ప్రాచీనకాలమునుండి, భారతీయులు జ్యోతిష, సాముద్రిక, ఆయుర్వేద, వాస్తుశాస్త్రములలో ప్రవీణులు. ఆయుర్వేదము వేదకాలము నుండి ఘనత వహించి, మానవుల జీవితము రోగయుక్తము గాకుండ, అమృతమయ మగునట్లు, అనేక ఔషధములను కనుగొని వైద్యవృత్తిని వైద్యు లభ్యసించు చున్నారు.

వ్యవసాయము భారతదేశములో ముఖ్యమైన పరిశ్రమ. దీనికి వలయు పనిముట్లు నిర్మించుకొని, పంటలను పండించు సదుపాయములను శాస్త్రములను, భారతీయులు నిర్మించుకొన్నారు. ఫలముల నిచ్చు తోటల పెంపకములో భారతీయులు నిపుణులు. ఇదిగాక, వృషభ, అశ్వ, గజాదుల పెంపకము, పోషణయందు భారతీయు లద్వితీయులు.

సముద్రయానము, నావలు సృష్టించు తీరు, ఆకాశగమనము మొదలగు శాస్త్ర కళలు, భారతీయులకు అనాదినుండి తెలియును.

వేయేల, జీవితములో నుపయోగపడు అనేక కళలయందు, భారతీయులు నిపుణత కలవారై, దేశసౌభాగ్యమునకు తోడ్పడుచున్నారు, లలిత కళలయందే గాక ఫలితకళలయందు గూడ, భారతీయులు అఖండప్రశస్తి బొందినవారు.

## భారత రాజ్యాంగ నిర్మాణములు

భారతీయులు ప్రాచీన కాలమున, మానసిక, అధ్యాత్మిక సాహిత్య లలితకళలయందు ఔన్నత్యము వహించినవారే కాని, ఐహికజీవనములోను రాజ్యాంగ నిర్మాణమందును పాశ్చాత్యులకంటె ఘనత వహించ లేదని, కొందర నుకొందురు. కాని, ఇది సత్యదూరమని చెప్పవచ్చును. భారతీయుల రాజ్యపరిపాలనావిధాన మంతయు, ధర్మబద్ధమై, ప్రజల స్వాతంత్ర్యము

నకు దోహదకారిగ నుండి, సాంఘిక కళ్యాణ భద్రతలను, యోగక్షేమ ఐశ్వర్యములను పెంపొందించినదిగా నుండెను.

ప్రతి సంఘమునకు. దేశమునకు, జాతికి ఒక ప్రత్యేక ఆత్మ యున్నదని భారతీయుల విశ్వాసము. వ్యక్తులవలెనే సంఘములు కూడ క్రొత్త అనుభవములు, మార్పులు, కష్ట సుఖములకు లోనగు చున్నవి. అంతరమున కలుగు మార్పులు బాహ్యమునకు ప్రసరించును.

ఆదికాలమందు భారతదేశములో కులము ప్రధానముగ నుండి, ప్రతి కులమునకు ఒక ప్రభువు లేక రాజు యుండెను. అతనిని కులజనులు ఎన్నుకొనుచుండిరి. కులజనుల సభలలో దేశ కార్యము లన్నియు తీర్మానింపబడుచుండెను. కులములనుబట్టి, కురుదేశము, పాంచాలము, మాళవము, సాళ్వము మొదలగు దేశ నామములు వచ్చినవి. క్రమేణ, ఈ కులములవారు ఎక్కువ ప్రదేశము కావలెనని ఇతరులపై యుద్ధములు చేసి వారి ప్రదేశముల నాక్రమింపజొచ్చిరి.

ఈ కాలమున వారి బుద్ధిబలముచేతను, జ్ఞానదృష్టిచేతను అన్ని కులములవారు ఋషులగుటకు అర్హులుగా నుండిరి. ఈ ఋషులు రాజ సభలకు వెళ్లుటయు, రాజ్యపరిపాలనావిధానము చూచుటయు, రాజులకు నీతులు, విధులు బోధించుటయు సామాన్యముగా జరుగుచుండెను. సర్వసంగ పరిత్యాగము జేసిన ఈ పావనపురుషులు ప్రజల యోగక్షేమమునకు కర్మయోగాభ్యాసకు లగుచుండిరి.

ఒక రాజుకు లోబడని ప్రజాస్వామ్యములు కూడ భారతావనిలో పూర్వ ముండెను. పూర్వకాలపు గ్రీసు దేశములోని ప్రజాస్వామ్యముల కంటె, వీనికి ఎక్కువ ప్రాబల్యము, స్థిరత్వము నుండెను. కొంత కాలమునకు యీ ప్రజాస్వామ్యము లందు దక్షత లోపించినందున, నిరంకుశ చక్రవర్తులకు లొంగవలసి వచ్చి, గొప్ప సామ్రాజ్యములలో కలిసిపోయినవి. అప్పటికి కూడ, ప్రజాస్వామ్య పద్ధతులకు వలుకుబడి, ప్రాబల్యము తగ్గలేదు.

ప్రతి రాజ్యమందును, మంత్రుల సభ, పౌర సభలు నుండినవి. నగర పరిపాలనము పౌరసభ వశములో నుండెను. ధర్మవిరుద్ధముగానడచు రాజులను సింహాసనములనుండి తొలగించు అధికారము ఈ సభ కుండెను. ఈ సభలో పట్టణము, గ్రామము, కులము, శ్రేణి, గణము, వీరి ప్రతినిధు లుండిరి. అనగా నాలుగు వర్ణములైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల ప్రతినిధులు పౌరసభలో నుండి దేశవ్యవహారవిషయము లను గురించి రాజులకు సలహాల నిచ్చుచు, రాజ్యపరిపాలనలో తోడ్పడు చుండిరి. రాజును పదభ్రష్టునిగ చేయవలసి వచ్చినపుడు పౌరసభ, రాష్ట్రసభయు కలిసి, ఈ విషయమును నిర్ణయించుచుండిరి. ఇందువలన, పూర్వము భారతవర్షములో రాజులు నిరంకుశులు కారని తెలుచున్నది.

ప్రాచీన కాలములో భారతములో చాతుర్వర్ణ్యము లేర్పడెను. ఒక్కొక వర్ణమునకు ఒక్కొకవిధమైన ధర్మముండగా, దాని ననుసరించి,

వారు తమ పనులను చేయుచుండిరి ఈ వర్ణములలో క్రమేణ జాతు లేర్పడెను. ఒక్కొక జాతికి ఒక ధర్మ మేర్పడెను. ఇవన్నియు స్వయంపోషకముగా నుండి ఎవరి వృత్తులను వారు సక్రమముగా నిర్వహించుకొను చుండిరి. వీరిలో తగాదాలు కలిగినపుడు వీరి సంఘములే వీటిని విచారించి, న్యాయమేర్పరచి, పరిష్కరించు చుండెడివి. ఈ వివాదము లనేకములు రాజసభలలో రాజసమక్షములో నిర్ణయింపబడుట లేదు. కాన, ఆ కాలపు రాజులు నిరంకుశ ప్రభువులు కారు. వారి అధికారమునకు హద్దులుండెను.

ఇంకను, ఆ కాలమున, ప్రతి గ్రామము స్వపరిపాలనము కలిగి, గ్రామవ్యవహారములను, గ్రామపంచాయతీలు చక్కబెట్టు చుండెను. ఇదే విధముగ, పట్టణముల పరిపాలన గూడ జరుగుచుండెను. ఎక్కడ జూచినను, వర్ణసంఘములు, జాతిసంఘములు, వాణిజ్యసంఘములు, వేదాంతసంఘములు, సభలు, గ్రామపంచాయతీలు, ఇవన్నియుండి, రాజుల నిరంకుశత్వమునకు హద్దులు కల్పించిన వచ్చెను. ప్రతి గ్రామము స్వయంపోషకముగను, స్వయం పరిపాలన గలదిగనుండి, గ్రామాభిమానము, సంఘీభావము, సమష్టి బాధ్యత, వీనిలో విరాజిల్లుచు, ప్రజలు ధర్మవర్తనులై, సౌఖ్యముగా నుండిరి. వీరి కంతకు పునాది సనాతన ధర్మము. రాజులు మొదలుకొని, ప్రతి సంఘము, వర్ణము, గ్రామము, పట్టణము, నగరము, ఇవన్నియు, ధర్మబద్ధముగా [illegible]

కార్యములు నిర్వహించు చుండిరి. భారత రాజ్యాంగము, పై చెప్పిన ఉన్నతాదర్శములతో నిర్మింపబడి నిర్వహింపబడుచుండెను.

కాని, దురదృష్టవశాత్తు, బాహ్యశత్రువులనుండి రాజ్యమును రక్షించుకొను సదుపాయములు, కట్టుబాట్లు రాజులలో శాశ్వతముగానుండ లేదు. ఒకే సామ్రాజ్యాధికార ముండవలెనని పూర్వులు గ్రహించి, రాజసూయ యాగములు చక్రవర్తులు చేసిరి. మౌర్యులు, గుప్తులు, ఆంధ్రులు ఏకచ్ఛత్రాధిపత్యము స్థాపించుటకు పాటుబడిరి. కాని, యిది ఫలించలేదు. ఆంతరంగికముగా, ఏకత్వమును, ఒకే విజ్ఞానమును, ధర్మమును, సంస్కృతిని సాధించిరి కాని, భారతీయులు బాహ్యఏకత్వము సాధించ లేకపోయిరి. అందువలన, పదకొండవ శతాబ్దమునుండి మహమ్మదీయ, ఐరోపాదేశజాతులు, తుదకు బ్రిటీషువారి దాడులకు భారతదేశము గురి అయి, దేశములో అంతఃకలహములు కలిగి, స్వరాజ్య మును పోగొట్టుకొనెను.

ప్రస్తుతము మనము పూర్వరాజ్యాంగ మందలి సుగుణములను అనుసరించి, ధర్మబద్ధమైన ప్రజాస్వామ్య స్వాతంత్రమును సంరక్షించు రాజ్యాంగమును ప్రతి ష్ఠించుకొని, భారతదేశమును విదేశాక్రమణలకు గురికాని, రక్షణలతో కాపాడుకొనుచు, జీవించవలెను.

# భారతీయ విశ్వసందేశము

పరమ సత్యమునే, పరమ పురుషుడనియు, దేవుడనియు, సర్వాతీత మనియు, సనాతనమనియు, అనంతమనియు, కేవలమనియు పలువిధముల నిర్వచించవచ్చును. ఈ కేవల సత్యమునుండియే అనంతజీవు లుత్పన్న మయి, అందులోనే యుండి, ఆ అనంతమును హద్దుపరచలేనివిగ నున్నవి.

ఆ పరమ సత్తలోనే దేశకాలములు, సచ్చిదానందములు, చరాచర ప్రపంచములు, సర్వజీవకోటి, వ్యక్తావ్యక్తములు, సర్వము నున్నవి. జీవాత్మ, పరమాత్మ యొక్క అంశము. కాని, మానవజన్మము సంభవించిన తర్వాత, జీవుడు అహంకారమునకు, త్రిగుణములకులోనై, సుఖదుఃఖములకు గురియగుచున్నాడు. వీటినుండి విముక్తుడగుటకు అత డనేక ప్రయాసలు పడవలసి వచ్చును. కాని, అతనిలో ఆత్మశక్తి యున్నందున, ముక్తు డగుటకు వీలున్నది. ఇందుకు సదుపాయములు గలవు. వీనిని గూర్చి, హిందూమత మీ విధముగ బోధించును.

సుఖదుఃఖములు రెండును మనస్సు యొక్క ఒకదశ. సుఖము మనస్సు యొక్క కోరతగినస్థితి; దుఃఖము మనస్సు యొక్క కోరతగని

స్థితి. ఈ స్థితులకు కారణము దేశకాల, మానవ, సంఘ పరిస్థితులు. మానవజీవితము, కుటుంబ, వర్గ, జాతి, ప్రపంచ, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, నైతిక వ్యవహారములు, వాతావరణములను బట్టి యుండును. ప్రతి వ్యక్తికి వీనితో సంబంధము కలదు. వీని కనుగుణముగ, సామరస్యంతో మెలగుచు, జీవించినపుడు వ్యక్తికి సుఖము కలుగును.

మానవుడు తన సుఖమునకే ప్రాకులాడుచు, ఇతరులక్షేమమునకు, సంఘమునకు, జాతికి వ్యతిరిక్తముగా నడచినచో కష్టములకు, దుఃఖములకు, అశాంతికి లోనగును. మానవుడు సంఘజీవి గనుక అందరి శ్రేయస్సు నాకాంక్షించవలెను. అహంకారముతో కూడిన కర్మలు సుఖమునకు శత్రువులు. కామ, క్రోధ, లోభ, మోహములకు వశుడై, జీవుడు స్వసుఖము నాకాంక్షించును. అప్పుడే దుఃఖము సంప్రాప్తమగును.

దుఃఖమునుండి విముక్తి నొందుటకు ముఖ్యముగా ఆంతరికజ్ఞానము సంపాదించుకొన వలెను. జీవుడు మనోభూమిక నుండి పైకి విజ్ఞాన స్తరమునకు బోయినపుడు సచ్చిదానందములు గోచరించును. వీని దివ్య తేజోవికాసములతో, లోపభూయిష్ఠమైన మనఃప్రాణ శరీరములను పరిశుద్ధముజేసి, దివ్యమయము చేయవలెను. అపుడు జీవుడు పరిపూర్ణుడు, భక్తుడు, కర్మిష్ఠి యగును. ఆ దివ్యస్థితి పొంది, దివ్యపరివర్తనము

కలిగినపుడు, దివ్యజీవనమున కర్తుడగును. అప్పు డాతనికి, సంఘము, జాతి, ప్రపంచము, సర్వ జంతుకోటి, దైవముగా కనబడి సమష్టి కల్యాణ భద్రతలకు తన సర్వస్వము సర్పించును. సర్వము భగవానుడని యుపలబ్ధి పొందినపుడు, సర్వమానవ భూతకోటిక్షేమమును జీవుడు ఆకాంక్షించును. తాను, ప్రపంచము ఒకటే నని యుపలబ్ధి పొందుటయే, పరమాదర్శము. ఈఆదర్శ జీవికి, సర్వభూతదయ, ప్రేమ సహజమైసర్వము భగవానుడని భావించి, ఆనందమయుడై జీవించును. ఈ సనాతనధర్మమే హిందూమతము. దీనినే వేదఋషులు వేదోపనిషత్తులు, వాల్మీకి, వ్యాసాదులు రామాయణ, భారత, ఇతిహాసములు, భగవద్గీత మొదలగు శాస్త్రములు, సాహిత్య చిత్రకళలు, రాజ్యాంగనిర్మాణములు, కవులు, చిత్రకారులు,చారిత్రకులు వెల్లడి చేసిరి. సమత్వము, ఆత్మీయతతో అందరు జీవయాత్ర గడపవలెననియే భారతీయులు ప్రపంచమున కందించు సందేశము.

సర్వేజనాః సుఖినో భవంతు. సమస్త సన్మంగళాని భవంతు ॥

ఓం, శాంతి, శ్శాంతి, శ్శాంతిః ॥